

గోష్ఠి అధ్యక్షులు ఆర్. శ్రీనివాసన్
(మద్రాస్ ఏప్రిల్ 21)



శ్రీమతి రుక్మిణీదేవి



ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్

(గోష్ఠిలో పాల్గొంటారు)

# స్వాతి తిరునాళ్ పై గోష్ఠి



ఎమ్ ఎస్ సుబ్బులక్ష్మి
(మద్రాస్, మే 8)



ఆలత్తూర్ సోదరులు
(తిరుచ్చి. మే 7)



కె. వి. నారాయణస్వామి స్వాతితిరునాళ్
కృతులు (మద్రాస్, ఏప్రిల్ 19)



వడివేల్ పిట్టువనార్‌కు శ్రీ స్వాతితిరునాళ్
కానుకగా బహూకరించిన దంతపు వయొలిన్



టి. ఎల్. వెంకటరామ అయ్యర్
(గోష్ఠిలో పాల్గొంటారు)




డా॥ వి. రాఘవన్ (ఏప్రిల్ 21-వ తేదీన జరుగు గోష్ఠిలో
పాల్గొంటారు)

వాణి
ప్రతినెలా , 22-వ తేదీలలో వెలువడును.
విడిప్రతి వెల 35 నయాపైసలు.
సంవత్సర చందా రూ. 8-40 నయాపైసలు.
సంవత్సరమునకు తక్కువ చందా
అంగీకరించబడదు.
ఇతర వివరములకు:
ఎడిటర్, 'వాణి'
ఆలిండియా రేడియో, మద్రాసు-4.



ALL INDIA RADIO



సంపుటము XIV] వాణి 7—4—1963 [సంచిక 22

కవి, గాయక శిఖామణి!

# స్వాతి తిరునాళ్ మహారాజు

సంధ్యావందనం శ్రీనివాసరావు

సుమారు ముప్పది సంవత్సరముల మునుపు వాగ్గేయకారులు, సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు గాయక శిఖామణి హరికేశవనల్లూర్ ముత్తయ్య భాగవతర్ గారి దీక్షాఫలముగ మరుగుపడియుండి స్వాతి తిరునాళ్ సంగీతరత్నములు మరల సముద్ధరింపబడినవి. తిరువనంతపుర సంస్థానమునకు అజన్మమునందే పట్టమును పొంది 'గర్భశ్రీమాన్' అను బిరుదమునకు సార్థకనామధేయుడై సంగీత త్రిమూర్తులకు ఒక తరము పిన్నవారై సమకాలీనులగు భాగ్యశాలురు శ్రీ స్వాతితిరునాళ్ రామవర్మ మహారాజు. తిరువనంతపుర సంస్థానము పుత్ర సంతానము లేని కారణమున మదరాసు గవర్నరు తమ ఈస్టిండియా కంపెనీ వశము చేయనున్న దురవస్థ 1813 ఏప్రిల్ 16-వ తేదీన ఈ అంశపురుషుని జననముతో తప్పినది. సంస్థాన ప్రజలందరూ హర్షించిరి. ఈయనే స్వాతితిరునాళ్. సంస్కృతము, మలయాళము, మరాఠీ, కన్నడం, తెలుగు, పారశీకము, అరబ్బీ, హిందీ, ఇంగ్లీష్ భాషలందు శ్రీ స్వాతి తిరునాళ్ మంచిప్రావీణ్యము సంపాదించిరి. చిన్న వయస్సునందే సంస్కృత భాషయందు మంచిపాండిత్యమును గడించి కావ్యములను రచియించు వ్యుత్పన్నులయిరి. సంగీత విద్యయందు, భరతశాస్త్రమునందు వీరికి మెండయిన అభిరుచిగలదని గుర్తించిన వీరి తల్లిదండ్రులు పెద్ద విద్వాంసుల వద్ద తర్ఫీదు నిప్పించిరి.



స్వాతితిరునాళ్ మహారాజు రాజ్యపరిపాలనలో ఖ్యాతిగాంచిన రాజకీయ ధురంధరులు. తిరువాన్కూర్ సంస్థానము వీరి ఏలుబడిలో సుభిక్షమై, అనేక రీతుల పురోగమించినది. వారు జీవించియుండిన 34 సంవత్సరముల లోపుగా తిరువాన్కూర్ సంస్థానమునకు ఎంతో లాభమును చేకూర్చిరి. విద్యా సంస్థలను ప్రతిష్ఠించిరి. దంతపురథమును తమకని అబ్బురముగా నిర్మించిరి. పద్మనాభస్వామివారి ఆలయము చుట్టు నవీనయుగ మండపములు కట్టించిరి. తమ పటాలములను ఆధునిక రీతులలో మంచి [illegible] ఏర్పాట్లుచేసిరి. అనేక పాఠశాలలందు ప్రజలకు ఉచితముగా విద్యావ్యాప్తికి వీలు కానుండు ఏర్పాట్లు చేసిరి. 'కులశేఖర పెరుమాళ్' అన్న నామాంతరముతో పారమార్థిక

## ఈ సంచికలో

ముఖచిత్రం: 'స్వాతి తిరునాళ్' మహారాజు
చిత్రకారుడు: హెచ్. వి. రామగోపాల్
[వీరి 150వ జన్మదిన జయంత్యుత్సవ కార్యక్రమాలు ఏప్రిల్ 16 నుండి మే 8 వరకు ఆకాశవాణి వివిధ కేంద్రములనుండి వినవచ్చును.]

దృష్టితో తమ కాలమును దేవతారాధన, ఆత్మవిచారములకు ఎక్కువగా వినియోగించిరి

వీరి సంస్థానమునందు సంగీత విద్వాంసులు, చిత్రకారులు, కవులు ఎందరెందరో ఆశ్రయమును పొందియుండిరి. ముత్తుస్వామి దీక్షితుల శిష్యులు వడివేలు నట్టువనార్, భరతనాట్య శిఖామణియయిన వారి చెలియలు రుక్మిణి వీరి సంస్థానమునందుండిరి. త్యాగయ్యగారి శిష్యులవద్ద, దీక్షితుల శిష్యులవద్ద ఆ కీర్తనలను విని బ్రహ్మాన దరవులకు చౌకకాల వర్ణములు, కీర్తనలు, భజనలు, స్వరజతులు, కుచేలోపాఖ్యానము, అజామిళోపాఖ్యానము అను సుప్రసిద్ధ గేయనాటకాలను సంస్కృతభాషలో రచించిరి. సంస్కృతభాషయందు వీరి కీర్తనలు నూరువరకు గలవు. తెలుగు, కన్నడము, హిందీ భాషలలోనూ కొన్ని రచనలను చేసిరి

పద్మనాభస్వామి

ప్రసిద్ధ రాగములందే ఎక్కువ కీర్తనలను రచించినను, ద్విజావంతి, ఘంటా, సారంగనాట, గౌళిపంతు మొదలగు అపూర్వ రాగములందు వీరి కీర్తనలు ఆదర్శనీయములగు లక్ష్యములు.

భరతశాస్త్రమునందు వీరికున్న ప్రావీణ్యత వీరి వర్ణములందలి స్వరరచనలు చాటగలవు. వీరి పదములు, జావళీలు శృంగార రస భరితములయి పద్మనాభ స్వామి పరముగ నున్నవి. అంబ పరముగ చేసిన నవరాత్రి కీర్తనలు, దశావతార కీర్తన, రాగమాలికలు, హిందీ భజనలు దేవతాస్తవముగ కొన్నివేల శ్లోకములు వారి భాగవత హృదయమును ప్రజలకు భక్తిపారవశ్యతను కలుగచేయును. ఇన్ని భాషలందు, ఇన్ని రకములగు సంగీత రచనలను చేసి తాము తరించి ఇతరులకు తరణోపాయమును కల్పించిన వీరి కీర్తనలు ఆచంద్రార్కము నిలచియుండును. సంగీత త్రిమూర్తుల తరువాత ఉత్కృష్టమయిన సంగీత రచనలు సల్పిన వాగ్గేయకారక మహారాజు స్వాతి తిరునాళ్. సుబ్బరామ దీక్షితులు, తచ్చూర్ సింగరాచార్యులుగారు ఇంకను పూర్వులు వారి రచనలు ప్రచురించిరి. 'సరసిజనాభ' (కాంభోజి రాగవర్ణం); 'చలమేల' శంకరాభరణ రాగవర్ణం, 'మందరధర' తోడి రాగ కీర్తన, 'రాసవిలాస' కాంభోజి రాగములోని ప్రబంధ కీర్తన, 'వలపుతాళవశమా'

[తరువాయి 51-వ పేజీలో]

# పురుషసూక్తము

కన్నడమూలం: డా॥ జి. ఎస్. శివరుద్రప్ప

తెలుగు: బొడ్డు బాపిరాజు

[ జాతీయకవి సమ్మేళనమున చదువబడినది ]

వేయి కన్నులు వేయి కరములు
వేయి పదములు వేయి శిరములు-వెలయు నతనికి
నవ్యభారత పురుషు డాతడు
అధివసించు సమస్తజన సంఫుల్ల హృదయాబ్జముల
పృథ్వీ వ్యోమపథ పర్యంతమాతడు....

అతని పావన పాద సన్నిధి మ్రోయు నంబుధి
అతని మౌళి మహోన్నతోజ్వల
మౌన మిహికాహార్య శిఖరము
వివిధ జనపద జన మనోహర మతని దేహము
నాళ నాళములందు నాతని కొత్తపె హృదయస్పందనం బది
అతని హస్తస్పర్శ భూధర శిఖర సీమలు
కదలి కలకలనాదముల గంగాయుతల్
ప్రవహించు ధారణి నాల్గు చెరగుల....

అతని యూష్మ స్పర్శమళమ్ముల
మృత్తికను నవజీవనచ్ఛవి అంకురించును
పొదుగులను వర్షించు మధుర క్షీరధారలు....
కన్నుతెరచిన చాలు నాతడు
స్నేహకరుణా సానునయ విశ్వాసదీపిక
లింటి నింటను వేయి వెలుగును
తారకా సుషమా కరమ్ముల వినదు నాతని వేదవాణియు
లే దళఃపతన ప్రభా భయలేశ మచ్చట....
అతని వెన్నెలవెలుగు రేకలు సోకినంత
కలస్వనంబుగ పల్లవించు
విపంచికా తంత్రీముఖంబులు
సుకవికోటికి మధురభావ స్ఫూర్తినొసగుచు
అతని కుపిత భ్రుకుటి దేశముఁగన్ రగుల్చును విప్లవాగ్నులు
తద్భళః కథనముల వార్తాపత్రికల పటలజ్వలించును-

అతని కంఠధ్వనులు కాననశైల వీధుల మేలుకొల్పును
యుగయుగమ్ముల గాఢనిద్రాభారము
పటాసంచలై చను పొంగిపొరలు నదీ స్రవంతులు
సేతువున బంధించి నటు కథల వాతని కనుసన్నల-
అతని హాసచ్ఛటలు పటు జలపాతములలో నందడించును
అతని యధర దరస్మితమ్ములు
లలిత విద్యుద్దీప కళికలు
అతని శ్రావ్యస్వరమె వినబడు
రేడియో శతమందు ప్రొందుగ
జగతి ప్రతిపదలాస్యగతి
వినదించు నాతని కింకిణినిక్వణ ఝుణంఝుణ
యంత్రపటు చటులాట్టహాసము అతని వీర్యవిజృంభణంబులు

అతని నామము నిఖిల మందిర ఫాల తిలకము
అతని కార్యస్ఫూర్తి ఓక ప్రోత్రమై భాసించు
ఘన సంశోధనాలయ మౌన సాధన....
అతని యిచ్ఛాశక్తి గడియారముల తిరుగును
తీర్థగునోడలు కడలిలో తెరచాపలెత్తుచు
గగన వీధి విమానముల్ పయనించు రెక్కలుసాచి స్వేచ్ఛగ
దేశ సీమారక్షకుల చక్షువుల జాగ్రజ్జ్యోతియాతడు
వేయికన్నులు వేయికరములు వేయిపదములు
వేయిశిరములు వెలయు నతనికి
నవ్యభారత పురుషు డాతడు
అధివసించు సమస్త జన సంఫుల్ల హృదయాబ్జముల
పృథ్వీ వ్యోమపథ పర్యంతమాతడు....

# స్వాతి తిరుణాళ్ జయంతి

స్వాతి తిరుణాళ్ రామవర్మ మహారాజ వాగ్గేయకారుడు ఈయన సుప్రసిద్ధులు, సమర్థులయిన పరిపాలకులుగానూ గొప్ప వాగ్గేయకారుడుగానూ ఘనతనందారు.

ఈ మహారాజ వాగ్గేయకారుని కృతులలో త్యాగరాజు రచనల లాలిత్యమూ, ముత్తుస్వామి దీక్షితుల రచనల గాంభీర్యమూ ఉంటాయి అని ప్రసిద్ధి.

ఈ రాజ వాగ్గేయకారుని 150 వ పుట్టినరోజు పండుగ ఏప్రిల్ 16 వ తేదీనుండి మే 8 వ తేదీవరకు నిర్వహించబడుతుంది, ఆకాశవాణి మద్రాసు కేంద్రం ఈ సందర్భంలో ఎన్నో ప్రత్యేక కార్యక్రమాలను ఏర్పాటుచేసింది.

స్వాతి తిరుణాళ్ కృతులను, ఏప్రిల్ 19న కె. వి. నారాయణస్వామి, ఏప్రిల్ 26న టి. ఎం. త్యాగరాజన్, మే 3న ఎం. ఏ. కల్యాణకృష్ణ భాగవతార్ గానం చేస్తారు.

స్వాతి తిరుణాళ్ వ్యక్తిత్వం వివిధరీతులను గురించిన గోష్ఠి ఏప్రిల్ 21న ప్రసారం అవుతుంది.

డాక్టర్ సి. పి. రామస్వామి అయ్యర్ ఏప్రిల్ 25న స్వాతి తిరుణాళ్ పరిపాలనా దక్షతనుగూర్చి ప్రసంగిస్తారు.

జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యంగారు మే 7వ తేదీన సంగీత మాగజైన్ కార్యక్రమంలో స్వాతి తిరుణాళ్ కృతుల ఘనతను ఇతరుల కృతులతో సరిపోల్చి చూపుతూ చిత్రిస్తారు.

అదే రోజున ఆలత్తూరు సోదరులు స్వాతి తిరుణాళ్ పదాలు, జావళ్లు, తిల్లానాలు, పదవర్ణాలు రాగమాలికలనుపాడే సంగీత కచేరి వుంటుంది. ఈ సంగీత కచేరి తిరుచ్చినుండి రిలే చేయబడుతుంది.

స్వాతి తిరుణాళ్ నృత్య సంగీత రచనలను మే 5వ తేదీన ప్రత్యేక కార్యక్రమంలో ప్రసారంచేస్తారు.

మే 6వ తేదీన తిరువాన్కూరు ఆస్థాన విద్వాంసులు కుంభకోణం రాజమాణిక్యం పిళ్ళై, మాయవరం గోవిందరాజ పిళ్ళై గారలు వయొలిన్ యుగళం కచేరి చేస్తారు.

"గర్భశ్రీమాన్" మళయాళ ప్రత్యేక రూపకం మే 5వ తేదీన ప్రసారం అవుతుంది దీని తమిళానువాదం మే 8న ప్రసారమవుతుంది.

స్వాతి తిరుణాళ్ "అజామిళోపాఖ్యానం" సంగీత రూపకం ఆకాశవాణి విజయవాడ కేంద్రం మే 2న ప్రసారం చేస్తుంది, మద్రాస్ కేంద్రం రిలే చేస్తుంది. ఈ ఉత్సవాలు మే 8వ తేదీ రాత్రి 9-30కు శ్రీమతి ఎం ఎస్ సుబ్బులక్ష్మి గారి పాటకచేరితో ముగుస్తవి.

[ఏప్రిల్ 16-వ తేదీనుండి మే 8-వ తేదీ వరకు జరిగే స్వాతితిరుణాళ్ ఉత్సవ కార్యక్రమ వివరాలు]

16-4-63
రా॥ 8-30 నుండి 8-45 వరకు ప్రారంభోపన్యాసం (ఆంగ్లం)
మద్రాస్ ఏ
డా॥ బి. గోపాలరెడ్డి
(అన్ని కేంద్రములు రిలే చేస్తాయి)



17-4-63
రా॥ 9-30 నుండి 9-45 వరకు
మద్రాస్ బి
"Swathi Tirunal"
talk by:
H. H. Martanda Varma
Elaya Raja of Travancore
(ఇండియాలోని అన్ని కేంద్రములు రిలే చేస్తాయి)

19-4-63
రా॥ 7-45 నుండి 8-55 వరకు స్వాతి తిరుణాళ్ కృతులు:
మద్రాస్ ఎ బి లో కె. వి నారాయణస్వామి
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నీ రిలేచేస్తాయి)

20-4-63
రా॥ 9-30 నుండి 11-00 వరకు అఖిలభారత సంగీత కార్యక్రమము
మద్రాస్ ఎ
స్వాతి తిరుణాళ్ కృతులు
సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్
(ఇండియాలోని అన్ని కేంద్రములు రిలేచేస్తాయి)

# ఉత్సవ ప్రత్యేక కార్యక్రమాలు

21-4-63
రా॥ 8-00 నుండి 8-30 వరకు
మద్రాస్ బి

Symposium on Swati Tirunal
Moderator. Prof. R. Srinivasan
Participants:
Musiri Subramanya Iyer: Ragabhava in the Kritis of Swathi Tirunal
Dr. V. Raghavan: Literary eminence of Swathi Thirunal as revealed in his works
T. L. Venkatarama Iyer: Swathi Tirunal and his contemporaries.
(దక్షిణ ప్రాంత కేంద్రములు రిలేచేస్తాయి)

25-4-63
రా॥ 8.45 నుండి 8-55 వరకు
మద్రాస్ ఎ (మాత్రం)
Swathi Tirunal as a ruler and his achievements outside the field of Music talk by
Dr. C. P. Ramaswami Aiyar

రా॥ 9-30 నుండి 11-00 వరకు అఖిల భారత సంగీత
మద్రాస్ ఎ బి లు రూపక కార్యక్రమము
కుచేలోపాఖ్యానము
(ఇండియాలోని అన్ని కేంద్రాలు రిలేచేస్తాయి)

26-4-63
రా॥ 7-30 నుండి 8-55 వరకు టి. ఎం. త్యాగరాజన్
మద్రాస్ బి (సంగీత కచేరి)
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నియు రిలేచేస్తాయి)

27-4-63
ఉ॥ 7-15 నుండి 7-30 వరకు సంస్కృత కృతులు:
మద్రాస్ బి (మాత్రం) స్వాతి తిరునాళ్
ప్రసంగం (సంస్కృతం)
డా॥ కె. కుంజుణ్ణిరాజా

28-4-63
మ॥ 11-30 నుండి 11-45 వరకు స్వాతితిరునాళ్ నవరాత్రి,
మద్రాస్ బి (మాత్రం) నవవిధభక్తి కీర్తనలు
ప్రసంగం (మలయాళం)
వి. ఎస్. నంబూద్రిపాద్

2-5-63
రా॥ 7-30 నుండి 8-30 వరకు అజామిళోపాఖ్యానం
విజయవాడ సంగీత రూపకం (సంస్కృతం)
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నీ రిలేచేస్తాయి)

3-5-63
రా॥ 7-45 నుండి 8-55 వరకు ఎం. ఎ. కల్యాణకృష్ణ భాగవతర్
మద్రాస్ ఎ, బి
సంగీత కచేరి
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నీ రిలేచేస్తాయి)

3-5-63
రా॥ 9-45 నుండి 10-15 వరకు స్వాతితిరునాళ్‌పై రూపకం
మద్రాస్ ఎ (మాత్రం) మలయాళ మాతృకకు తమిళం
శంకరమూర్తి

5-5-63
మ॥ 11-30 నుండి 12-00 వరకు "గర్భశ్రీమాన్"
మద్రాస్ బి (మాత్రం) రూపకం (మలయాళం)
రచన: కె. పద్మనాభన్ నాయర్

7-5-63
రా॥ 9-15 నుండి 9-30 వరకు సంగీత మ్యాగజైన్
మద్రాస్ బి కార్యక్రమము
"స్వాతితిరునాళ్‌పై"
సమర్పణ: జి. ఎస్. బాలసుబ్రహ్మణ్యం
(తిరుచ్చి కేంద్రం రిలేచేస్తుంది)

రా॥ 7-45 నుండి 8-55 వరకు ఆలత్తూర్ సోదరులు,
(మద్రాస్ ఎ బి లు) స్వాతితిరునాళ్: పదములు,
జావళిలు, తిల్లానాలు, పదవర్ణములు,
రాగమాలికలు
(తిరుచ్చినుండి రిలే)

8-5-63
రా॥ 9-30 నుండి 11 వరకు స్వాతితిరునాళ్ కృతులు:
మద్రాస్ ఎ ఎం. ఎస్. సుబ్బులక్ష్మి
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నీ 9-15 రిలేచేస్తాయి)

11-5-63
రా॥ 9-30 నుండి 11-00 వరకు అఖిల భారత సంగీత
మద్రాస్ ఎ కార్యక్రమము
(హిందూస్థానీ)
(ఇండియాలోని అన్ని కేంద్రములు రిలేచేస్తాయి)

5-5-63

రా॥ 9-45 నుండి 10-30 వరకు స్వాతితిరుణాళ్ నృత్య గీతులు
(తిరుచ్చి)
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నీ రిలే చేస్తాయి)

6-5-63

రా॥ 9-00 నుండి 10-30 వరకు స్వాతితిరుణాళ్ కృతులు:
(తిరుచ్చి) వయొలిన్ యుగళం
కుంభకోణం రాజమాణిక్యం పిళ్ళై
మాయవరం గోవిందరాజ పిళ్ళై
(దక్షిణ ప్రాంతపు కేంద్రములన్నీ రిలే చేస్తాయి)

## మద్రాస్ కేంద్ర కార్యక్రమ వివరములు

16-4-63

ఉ॥ 7-35 నుండి 7-45 వరకు స్వాతితిరుణాళ్ కృతులు:
వాద్యసంగీతం

ఉ॥ 8-00 నుండి 8-15 వరకు భావయామి రఘురామం
రామాయణ రాగమాలిక:
ఎం. ఎస్. సుబ్బులక్ష్మి



17-4-63

ఉ॥ 7-35 నుండి 8-00 వరకు ఎస్. జి. సీతారామన్

రా॥ 9-30 నుండి 9-45 వరకు పదం, జావళీలు:
టి. బృందు, టి. ముక్త.

21-4-63

ఉ॥ 7-35 నుండి 8-10 వరకు సి. సరోజ, సి. లలిత

మ॥ 1-00 నుండి 1-30 వరకు వాద్యగోష్ఠి

24-4-63

రా॥ 9-30 నుండి 9-45 వరకు అపూర్వ రాగములు:
కమలా కృష్ణమూర్తి

26-4-63

సా॥ 6-35 నుండి 7-00 వరకు పి. లీల, కె. ఆర్. లక్ష్మి

27-4-63

రా॥ 7-30 నుండి 8-30 వరకు శీర్కాళి గోవిందరాజన్
వి. గోవిందస్వామి నాయకర్: వయొలిన్
మద్రాస్ ఎ. కణ్ణన్: మృదంగం
టి. ఎస్. విల్వాద్రి అయ్యర్: ఘటం

29-4-63

రా॥ 9-30 నుండి 10-30 వరకు ఎస్. రామకృష్ణ నాయుడు:
క్లారినెట్
తిరుచ్చి బాలసుబ్బరాయులు: వయొలిన్
కోయంబత్తూరు ఎస్. రామస్వామి:
మృదంగం

3-5-63

రా॥ 10-15 నుండి 10-30 వరకు బి. కల్యాణరామన్

5-5-63

ఉ॥ 7-35 నుండి 8-00 వరకు కె. ఎస్. నారాయణస్వామి:
వీణ

మ॥ 12-30 నుండి 1-00 వరకు కీర్తనమాలిక

8-5-63

రా॥ 9-00 నుండి 9-30 వరకు కె. వి. కృష్ణన్

# ప్రతిజ్ఞ

హిందీమూలం: శ్రీరామ్‌ధారీ సింహ 'దినకర్'

తెలుగు. శ్రీ రావకొండ నరసింహమూర్తి

శీతభల్లాగ్రము వెల్గుచున్నది నవశ్రీస్వప్న సంభార సం
భృతమై, వీరవరేణ్య! తావక దహద్వీక్షణుగ్రగ్రాస, సం
స్మృతి నొక్కుమ్మడి క్రొత్తసేసెదవా నీచేఁ జేత, నేచేత నో
ధృతవీరవ్రత సుంత తెల్పవా భవద్దీక్షావిధి వ్యాకృతుల్....

ధృతవీరవ్రత బద్ధకంకణ రణదీప్తమూర్తి, మాపృత్తి, భా
రత మాతారుణ పాదపద్మవిలసద్రాగాంబుధిం దోగి, ద
స్యుతమఃపుంజము పారద్రోలగ జనుర్జ్యోతిర్విలాసాకృతిన్
క్షితిక్షింజొచ్చితి మేము వీరులము విక్షేపింప దుర్వృత్తులన్....

యమదంష్ట్రల్ పెకలించి పెట్టెదము మాకౌ పృథ్విపై
నొక్క దు
ర్దమశత్రుం దలవాని దృప్తశిరమున్ తప్తాగ్ని గోళంబుచే
మమియ న్నేత్రులు మొత్తివైచెదము మాయున్ మాయునా
డింబు దం
బము ముమ్మాటికి, భారతీయజనతా స్వాతంత్ర్య రక్షార్థమై....

పుండాకోరులుగాక ముమ్ము ననికిం బోరాడ రమ్మందురో
ముండంబుల్ తెగగొట్టిపెట్టి రణచాముండీశ్వరి ప్రీతికై
గుండెల్ చీలిచి వేర్చిపెట్టెదము మాకుండౌష్ఠ్యమున్ మాన్పు దు
ష్పాండిత్యంబులు లేవు లే యనుచు సంభావించిరో శాత్రవుల్ ...

నగరాట్ప్రాంగణమెల్ల శాత్రవుల ఛిన్నాభిన్న మస్తంబులన్
తోరణంబూవుల పెట్టనేసి, యటు నాత్రోవన్ జ్వలత్పావకా
వగవోలెన్ గగనోచ్చమై యెగసి కాల్పన్ వైరి దేశమ్ములన్
భుగభుగధ్వానము లెల్లెడల్ పిడుల శంఖోయంచు పెల్లార్చెదన్

పగలం బట్టెద మెట్టి కట్టిడులో యప్పావప్రగల్భాత్ము లే
తెగువం గాలిడి మేరమీరి యిటు మా తీర్థస్థలిం జొచ్చి, రా
పొగరుం బోవుదకం బు మాన్పెదము మా పోరాడుకైకైదు, వా
మరాయుళ్ళకు మున్ను మన్ను తినిపింపన్ జేసి, నిక్కమ్ము మా
పగ్రాలెన్నడు వెన్నుజూటి తరుమన్ పట్టించుకోకుంట నీ
పొగరుబ్బుం బడి సప్తకోట్ల బడుగుల్ పోరంగ గాల్ద్రువ్వి రి
తెగువే చాలను మెచ్చుకొంటి మిక మా దేశమ్మపై జూతురా
పగుఱన్ దుండము, భారతీయజనతా హైమాద్రి శైలోచ్చ బా

హుంకారోత్థాపిత శౌర్యఖడ్గ జనితోద్ధుంకార క్రోధానలా
పగముం చెత్తగ, తుప్పుమర్ల నపుడే పాపంబులున్ పండెడున్.

ఆ హిమగిరిమేని సాగరము లజ్జితులై పడి తెట్టగిల్లు, ఝుం
ఝులు కనుసైగలందుకొని స్తబ్దత నొందుచు విల్చిపోవు, కెం
బలుకులు విన్నచో ప్రళయపావకకీలలు ప్రజ్వరిల్లు, బో
దలచిన కాలవేషములు తత్తఱబిత్తరపోయి నిల్చు, నో
చలమతులార క్రించులయి సామజమున్ గని తుచ్ఛకర్మ్మలం
బలె మేలుగంగ నేర్చిరిది పాడియె - మీకగు గాని, యెల్లి మీ
బలమది మమ్ము వేడుకొన వచ్చెదు నప్పుడు మిమ్ము మీ మొగం
బులె పులి జూడగావలెనొ పోలద చెప్పగ విప్పుడాస్థితిన్
బలురయి వట్టసే కనులు కావరమెక్కిన కార్ణంబుగా
తలంచిరి స్వచ్ఛనీలబల శంజదకాద్భుత సుందరప్రభా
మలముల మాదు నెమ్మదులు, మానెద మేవిధి పోరు? నేలకో
తలపరు స్వాభిమాన ధనధన్యము భారతజాతి, తత్తపి
పలుగోకదెత్తి వచ్చితిరి పారము ముట్టెను మా కృధాగ్నికిన్
తలగమునంత చేరబడి తప్పదు యుద్ధము మీకు మా మా
కలగుడయస్త్ర సంత్రమణ గట్టిగ ప్రాకుచు పొర్లి దొర్లు - నం
తులవికటాట్టహాసములకన్ నరివచ్చు మహోగ్ర ఘోరమై....

ర దో భారత వీరులార పటువీర్య ప్రౌఢి, ఘోరాజిలో
చెండాడం బర్విందిన సైన్యముల విస్తీర్ణ ప్రతాపోజ్వలో
ద్దండోదగ్ర మహాగ్ని ఖండముల క్రోధజ్వాలలన్ చిల్చి, రా
రండో భారత పూర్వపౌరుష ధృతిప్రాగల్భ్య బుద్ధోదధుల్....

హిమవన్నగ వింధ్యాచల
సమరోత్సవ కుతుకజన్య సంతత ఘోషల్
జముపీటికి సరిపీరులం
గ్రమమున బలిపించు సొబగు గనర దో హో....

> విరా క్రమశిక్షణ
> భారతదేశానికి బలం

జాహ్నవీ నర్మదా సరయూ కళిందజా
తీరస్థ వీరాధి వీరవరులు,
కృష్ణవేణీ పినాకిని గౌతమీ కవే
రాత్మజా తీర వీరాధిపతులు,
చిత్తోడు కోటలో సింహప్రతాపమ్ము
పుణికి తెచ్చిన రాజపుత్రనృపులు,
సింహగడంబున చేబట్టి దనుజుని
చెండు చెండాడిన గండుమగలు

విక్రమార్కులు నిర్వక్ర వీరగతులు
చంద్రగుప్తులు చాణక్య చతురమతులు
యుక్తి కుశలురు శివరాజియోధవరులు
మహితరాణాప్రతాపుల మానధనులు
రండురండోయి శత్రువు రానెవచ్చె
కదలి రండోయి కలగిన కడలివోలె
పొరదాటించిరావలె మిత్తివీటి
త్రోవ చూపించవలెగాని పోవడితడు....

మడిగట్టి కొంతకాలము
ముడిగట్టియు గొంతకాలముం బోయెనుబో
చెడె భాక మ్మిపుడైనను
గడితప్పిన పగల బట్టి ఖండించవలెన్....

బ్రదుకు బ్రదుకెల్ల మానియై బ్రదికి తుదకు
విసిగి జన్మభూమి విడిచి, వెడలె నెవడు
ఎవనికై నేటిదనక, గొంతెత్తి పిలచు
చుంటి మానేత ససహాయభూరు పిలుపు
డింకనైనను, నా జాదుహిందు ఫౌజు
వాని భారత సుకపుత్రుడైన ఘనుని
వెదకి టిప్పుసుల్తానుల పిలచి భగత
సింగుల బ్రదిమిలాడి యీ సంగరంపు
ముప్పు తప్పించి పోదని చెప్పిరండు,
కత్తిపట్టినవానిని నెత్తి మొత్తి
నట్టి,-నాటి తప్పినాటి కెట్టి ముప్పు
దెచ్చెనో యనుభవమునకు వచ్చె చాలు,
విప్లవమ్మది వెల్లువై విఱిగి పడిన
సాధనాజ్వాల లన్నియు సమతనందె
ఒక్కరూపుగ నిల్చుట విక్రమమ్మో

సమరవీరమ్మైనను, సత్యసమర వీర
మ్మైన నది కోమలమ్ముగా దలికతినము
వీరధర్మము నొక్క- డా స్వీరు దెరుగు,
నాటి సాబర్మతీ తపోవాటి, పిలచు
తానుగా నెలుగెత్తి శతద్రునదివి....

త్రిపిటక గ్రంథముల్ విప్పి త్రిప్ప దెవడు,
ఖడ్గముల్ బట్టి రండోహో కదనమునకు
అరుల చెండు జెండాడగా నురికిరండు
వీరభారత సుప్రజా భూరలార....

లెండో భారతవీరులార రణభేరీ కాహళధ్వాన - దో
ర్దండోత్తాల కరాళఖడ్గ విశికృత్త ద్వేష్టృసంఘాసృగు
చ్చండా భీషణ రుండముండ విలసత్సంగ్రామ రంగాగ్ర - దీ
పాండిత్యంబులు చూపరం డఖిల భుగ్వ్యాహార గర్వోద్ధతిన్....

సతత సమాధి నిష్ఠులయి సచ్చిదఖండ విభావిభావనా
తతమతులార ! మీ హృదయతప్తజగద్ద్యుతి తెచ్చితెచ్చి హ
స్తతల కిరాజియైన యసిధారకు పూని యనుగ్రహింపుడీ
కృతమతి జేసి మేమిపుడె కింపరి పంథుల దున్మగావలెన్....

వీర విలాసులార ! జయవెట్టను గౌతముదేని నేడు మీ
భారత నాజిలోగని యశోకుడునైతము కత్తినెత్తి దు
ర్వీర శిరంబులన్ గగనవీథుల కెత్తుచు క్రీడసల్ప ప్ర
స్ఫార పరాక్రమస్ఫురణ శత్రుల దున్మెదు ధర్మరక్షకై....

"సుగుణనిధి చంద్రా"

ఒక సుప్రసిద్ధ గాయకుడు తిరువాన్కూర్ సంస్థానమున కేగి శ్రీ స్వాతి తిరుణాళ్ మహారాజుగారి సమక్షమున "సుగుణ నిధిచంద్రా కులశేఖరేంద్రా" యను పల్లవిని కల్పించి సాహిత్య ప్రస్తారము చేయుచు "సుగుణనిధిచంద్రా గుణనిధి చంద్రా, నిధిచంద్రా ధీచంద్రా చంద్రా, కులశేఖరేంద్రా" యను గోపుచ్ఛయతిని అతి చమత్కారముగ పాడి రసజ్ఞ శిఖామణియగు మహారాజుని యపారదయకు పాత్రుడాయెనట

—పెంజమూరు వరదరాజ అయ్యంగార్.

# ఉత్పత్తి పెంచుదాం

టి. ఎస్. రాజు

[ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ ఉపాధ్యక్షులు]

''యుద్ధంలో విజయం సాధించడానికి సైన్యబలం మాత్రం సరిపోదు. దానికి దేశం మొత్తంమీద పరిశ్రమలు పూర్తిగా సద్దతు నివ్వాలి. మనకు అవసరమైన రీతులలో ఉత్పత్తి అన్నివిధాలా పెంచాలి. ఈ అధికోత్పత్తిలో ఏవిధమైన విఘ్నాలూ రానీయకూడదు అందుకే యీ మహాప్రయత్నంలో సమ్మెలు చేయకండి'' అని ప్రధానమంత్రి హెచ్చరించారు. ఈ అవసర పరిస్థితిలో ఉత్పత్తి పెంచాలి. కర్షకుల పొలాల వ్యవసాయక్షేత్రంలో కూడా ఆంధ్రదేశం ఆహారధాన్యాల పంటల్లో మిగులు రాష్ట్రం. అన్నదానం చేయడంలో అన్నపూర్ణ యని పేరు పొందింది. 'అన్నం పరబ్రహ్మ'. ఆ యన్నం మరింత తయారుచేసి అవసరమైనవారికి పెట్టడంలో ఆంధ్రదేశం వెనుదీయదు. ఇక్కడ ఉత్పత్తి పెంచుతుంది. ఇతర దేశాలనుండి అన్నధాన్యాలు తెప్పించుకోవలసిన అవసరంలేకుండా చేస్తుంది.

ఇంక హిమాలయ పర్వతాలలో ఈశాన్య సరిహద్దులో లడఖ్ లోయలలో ఎత్తయిన మంచుకొండలమీద పోరాడుతున్న మన వీరులకి క్రొత్త రకం ఆహారం కావాలి. జీడిపప్పు, వేరుశనగపప్పు బెల్లం యిలాంటివి డబ్బాలలో పెట్టి పంపిస్తున్నారు. ఇవన్నీ మన ఆంధ్రదేశంలో ఎంతయినా ఉత్పత్తి అవుతున్నాయి. ఇవి యింకా పెంచి డబ్బాలలో ప్యాక్ చేసి కూడ పంపవచ్చు.

## అనేక మార్గాలు

ఉత్పత్తి పెంచడానికి అనేక మార్గాలున్నవి. ముందు మన పరిశ్రమలలో పనిచేసే కార్మికులంతా మనస్ఫూర్తిగా పనిచెయ్యాలి. ఆయుధాలు అస్త్రశస్త్రాలు ఉత్పత్తి అర్డినెన్సు ఫ్యాక్టరీలు అహోరాత్రాలు ఇరవై నాలుగు గంటలూ పనిచేయాలి. చేస్తున్నవి. అలాగే నేడు దేశరక్షణకోసం పనికివచ్చే పరిశ్రమల ఉత్పత్తి పెంచడంకోసం అవసరమైతే డబుల్ షిఫ్టులు పనిచేసి సరకు అందించాలి. పరిశ్రమ బొగ్గు పరిశ్రమ, సిమెంటు, రసాయనాలు ఇవన్నీ ప్రస్తుతసమయంలో ఉత్పత్తి పెంచవలసిందే. మన రాష్ట్రంలో కొత్తగూడెంవద్ద బొగ్గగనులలో పనిచేసే కార్మికులు సెలవు రోజుకూడ పనిచేసి ఆరోజు ఓవర్ టైమువల్ల సంపాదించే సొమ్ము మన జాతీయరక్షణ నిధికిస్తున్నారు. ఇది మొత్తం ఒక లక్షకు మించిఉంటుంది. అలాగే నాగార్జునసాగర నిర్మాణంలో పనివారు. అదనంగా పనిచేసి అలాగ సంపాదించే రాబడి డిఫెన్సు నిధికిచ్చారు. ఇలాగ మనదేశంలో పరిశ్రమలన్నీ ముందుకి వచ్చి, రేయింబవళ్ళు పనిచేసి ఉత్పత్తి పెంచవచ్చును. దీనికి కార్మికుల దీక్షయే కాక, యజమానుల ప్రోత్సాహం కల్పించాలి. ఇప్పటి అవసరాలకి కావలసిన క్రొత్తరకం సామాన్లు ఇతర దేశాలలోనుండి తెప్పించకుండా ఇక్కడే ఉత్పత్తిచెయ్యాలి. మన దేశంలో ఉన్న పెట్రోలు శుద్ధికర్మాగారం [ఆయిల్ రిఫైనరి] ఉక్కు ఫ్యాక్టరీలు బొగ్గుగనులు సిమెంటు ఫ్యాక్టరీలు పంచదార మిల్లులు దారపు మిల్లులు ఇలాంటివన్నీ ఉత్పత్తి పెంచాలి క్రొత్త పనిముట్లు యంత్రాలూ కావలసివస్తే డిఫెన్సుకి పనికివచ్చే సామగ్రిని తయారుచేయడంలో వినియోగించాలి

## దీక్ష

ఆంధ్రప్రదేశం ముఖ్యంగా వ్యవసాయ ప్రధానమైనదేశం. అందుకని పంటలు పెంచి ఆహారధాన్యాల ఉత్పత్తి సాధ్యమైనంత పెంచడానికి దీక్ష తీసుకొంటున్నారు. ఆ ప్రయత్నంలో మంచి నీటివసతి కల్పించి మంచి విత్తనాలిచ్చి మంచి యెరువులు సప్లైచేసి అన్నివిధాల మన ప్రభుత్వం తోడ్పడుతుంది, ఈ అవకాశం వినియోగించుకొని రైతులు పొలాలలో శ్రమించి వ్యవసాయ కూలీలూ ముందుకువచ్చి చెమటోడ్చి పనిచెయ్యాలి.

మనదేశ వ్యవసాయశాఖ మంత్రి జ్ఞాపకం చేసినట్లు మనకి మన స్వాతంత్ర్యం చాల ప్రియమైన వస్తువు. దానికెంత మూల్యమైనా సరే పూర్తిగా చెల్లించితీరాలి. మనదేశపు ప్రజల శ్రేయస్సుకోసం, మనదేశమాత స్వాతంత్ర్యంకోసం ఎంత మూల్యం చెల్లించినా అది తక్కువే అవుతుంది.''

ఈమాటలు మన ప్రధాని నెహ్రూ నేడు మనదేశం ఎదుర్కొంటున్న విపత్తుగురించి చెప్తూ రేడియోలో పలికిన మాటలు. యీ పిలుపు విన్నంతనే మన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యీ రాష్ట్ర సర్వస్వం జన ధన సంపత్తులూ భారతదేశ సేవకు సమర్పిస్తున్నామని ప్రకటించారు. ఈ ప్రకటన వెనుక నాలుగు కోట్ల ఆంధ్రజనుల అండదండలు మన ముఖ్యమంత్రికి ఉన్నవి.

రాష్ట్ర సర్వస్వం అర్పించడమంటే ఏమిటి?

మన ధన జన బల సంపదలన్నీ సమర్పించడమన్నమాట. రణరంగంలో మన సేనలు చైనా దురాక్రమణ నెదుర్కొని పోరాడుతున్నారు. తమ సర్వశక్తులూ ధారపోస్తున్నారు. మొదట్లో మొండిగా ముందుకి చొచ్చుకొని వచ్చి, చైనా దురాక్రమణను తరిమివేసి, మన భూభాగం మళ్లా మనం దక్కించుకోవాలంటే ఇది మహాప్రయత్నమే. దానికి మన సైనికబలం పూర్తిగా ముందు నిలిచింది. ఇంక దేశరక్షణ బలపరచడానికి ఉత్సాహవంతులయిన యువకులు ముందుకి వస్తున్నారు. అందుకే నిర్బంధ సైన్యశిక్షణ మన దేశంలో అక్కరలేదని మన ప్రధానమంత్రి నెహ్రూ ధైర్యంగా చెప్పారు.

స్వతంత్రానికి పెట్టుబడి

రక్షణ బాండ్లు కొనండి

...ందు మిగిలింది చెమట రక్తము, శ్రమ. కార్యరంగంలో ఉన్నా కర్మ క్షేత్రంలో ఉన్నా ఫ్యాక్టరీలో పని చేసినా వ్యవసాయ రంగంలో వున్నా శక్తివంచన లేకుండా సర్వస్వమూ త్యాగంచేసి పనిచెయ్యాలి. అది ఉత్పత్తి పెంచడంలో మరీ ఫలించాలి.

మనదేశం స్వాతంత్ర్యం పొంది పదిహేనేండ్లు మాత్రమే అయింది. ఈ స్వల్పకాలంలోను మన ఆర్థిక స్థితి పెంచుకోవడానికి దేశ సంపదలు వృద్ధిచేసుకోవడానికి పంచవర్ష ప్రణాళికలు వేసికొని అన్నిరంగాల లోను అధిక్యం సంపాదిస్తున్నాం. అంతేకాక ప్రజాస్వామ్య రాజ్యాలలో మన పట్టుదల పరపతి పెరిగాయి. ప్రపంచ సమితులలో భారతీయుల కంఠం ప్రతిధ్వనిస్తోంది. అందరూ భక్తిశ్రద్ధలతో వింటున్నారు. ప్రఖ్యాతి పెరుగుతోంది. పలుకుబడి హెచ్చుతోంది. ఇదిచూచి ఇరుగుపొరుగు చైనా చూడలేకపోయింది. వెన్నుపోటు పొడిచి ద్రోహంగా విరుచుకు పడ్డారు శవాలు తేగారు. ఆ శవాల నెదిరించి మనం తగిన సమాధానం చెప్పాలి. ఆ సమాధానం సమర రంగంలో మన సైనికులు వీర సాహసాలతో చెప్తూనే ఉన్నారు. అంతటితో మన యుద్ధప్రయత్నం పూర్తి కాలేదు.

వారికితోడు మన పారిశ్రామిక రంగంలోను వ్యవసాయ రంగంలోను తగిన సమాధానం చెప్పాలి. ఉత్పత్తి పెంచాలి. మనం తయారు చేసే ప్రతి వనిమట్టూ శత్రువు గొడ్డలిపెట్టు, మనం పండించే ప్రతి బస్తా ధాన్యం చైనా పేపల పాలిటి బ్రహ్మాస్త్రంలాగ పనిచేస్తుంది.

ఇతర దేశాలలో మనం ఉత్పత్తి చేసే చేతి పరిశ్రమలకు అందమైన రకరకాల వస్తువులకు మంచిగిరాకీ వుంది. ఇవి ఉత్పత్తి యెక్కువ చేయడమేకాం ఇతర దేశాలలో సొగా అమ్మకం చేయించాలి. ఇవి యెన్ని అమ్మితే అన్ని డాలర్లు పౌనులు ఇతర దేశాలలో మనకి లభిస్తాయి. మన అవసర పరిస్థితులలో అవి వస్తాయి.

ఇలాగ భారీ పరిశ్రమలలో పెద్ద పరిశ్రమల్లో చిన్న పరిశ్రమల్లో చేతి పరిశ్రమలలో అన్నింటిలోను ఉత్పత్తి పెంచాలి. ఇందుకు యజమానులు ప్రోత్సాహంతోపాటు పనివాళ్ల సము త్సాహం ముందుకిరావాలి యుద్ధ రంగంలో మనకేం విజయం సాధించాలి అంటే ఉత్పత్తి పెంచుదాం. దానికి మనం చేతులనిండా పని చేద్దాం. చెమటోడ్చి శ్రమపడదాం మన వరకు ఉత్పత్తిని అధికం చేద్దాం. ఇంకా అధికం చేద్దాం.

[సంక్షిప్తం]

## తిరుచ్చి

తిరుచిరాపల్లి కేంద్రంనుండి వివిధభారతి కార్యక్రమాలు ఈ క్రింది విధముగా ప్రసారము చేయబడును:-

202.7 మీ (1480 కిలోసై)

వివిధభారతి (రిలే)

ఆదివారములు ముఖ్యమైన పండుగ దినాలు

ఉ॥ 7-00 నుండి 9-30
10-15 నుండి 12-00
మ॥ 2-00 నుండి 3-30
4-00 నుండి 5-45
సా॥ 6-30 నుండి 9-45

ఆదివారములు మినహా మిగతా రోజులలో

ఉ॥ 7-00 నుండి 9-30
11-00 నుండి 12-00
మ॥ 2-00 నుండి 3-00
4-00 నుండి 5-45
సా॥ 6-30 నుండి 9-45

[వివరాలు 62-వ పేజీలో]

## మద్రాస్-బి

(వివిధ భారతి)

193.5 (1550 కిలోసై)

[ఏప్రిల్ 28 వ తేదీనుండి మద్రాస్ కేంద్రంనుండి వివిధభారతి కార్యక్రమాలు ఈ క్రింది విధముగా ప్రసారమ చేయబడును.

ఆదివారములు ముఖ్యమైన పండుగ దినాలు

ఉ॥ 7-00 నుండి 9-30
10-15 నుండి 12-00
మ॥ 2-00 నుండి 3-30
4-00 నుండి 6-15
సా॥ 6-30 నుండి 9-45

ఆదివారములు మినహా మిగతా రోజులలో

ఉ॥ 7-00 నుండి 9-30
11-00 నుండి 12-00
మ॥ 2-00 నుండి 3-00
4-00 నుండి 6-15
సా॥ 6-30 నుండి 9-45

[వివరాలు 62-వ పేజీలో]

## దేశరక్షణ: ప్రత్యేక వార్తా ప్రసారాలు

ప్రతిదినము ఉదయం 6-40 ప్రత్యేక వార్తా ప్రసారము (ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు, ఈ కార్యక్రమము మద్రాస్ బి, హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.

వారంలో శనివారము తప్ప మిగతా రోజులలో

ప్రతిరోజు రా॥ 10-30 ప్రత్యేక వార్తా ప్రసారము
శనివారం రా॥ 11-00 ప్రత్యేక వార్తా ప్రసారము

ఢిల్లీనుండి ప్రసారమగు పై రెండు కార్యక్రమాలు మద్రాస్ బి, హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.

# ప్రసార విశేషాలు

## 'ఆకాశవాణి సాహిత్య సమారోహం'

(తెలుగు)

తెలుగు సాహిత్యంలో 'దేశభక్తి' సమీక్ష

డా॥ శ్రీపాదగోపాలకృష్ణమూర్తి

మ్యాగజైన్ కార్యక్రమము

దేశభక్తి గేయాలు

రచన: కృష్ణశాస్త్రి

కథానిక

పద్యపఠనం

నాటిక

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ఏప్రిల్ 23-వ తేదీ మంగళవారం రాత్రి 9-30 గంటలకు ఏర్పాటుచేసింది. ఈ కార్యక్రమమును హైదరాబాద్, విజయవాడ, మద్రాస్-బి కేంద్రముల నుండి వినవచ్చును.

## కవితాగోష్ఠి

(సంస్కృతము)

(దేశీయ అత్యవసర పరిస్థితిపై)

ఏప్రిల్ నెల 25 వ తేదీ గురువారం రాత్రి 9-30 గంటకు 'కవితాగోష్ఠి' (సంస్కృతం) ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంవారు ఏర్పాటు చేశారు. విజయవాడ కేంద్రము రిలే చేస్తుంది కార్యక్రమమును.

ఇందు పాల్గొను కవులు:

చలంతర రంగాచార్యులు

ఎన్. సి. రఘునాథాచార్యులు

ఎస్. టి. ఎస్. వెంకటాచార్య

పరాయితం కృష్ణమూర్తిశాస్త్రి

శ్రీ భాష్యం విజయసారథి

## స్వరరంగిణి

సంగీత మాగజైన్ కార్యక్రమము మహారాజా స్వాతి తిరునాళ్ 160 వ జన్మదినాన్ని పురస్కరించుకొని 'స్వరరంగిణి' సంగీత మాగజైన్ కార్యక్రమం ఆకాశవాణి విజయవాడ కేంద్రం ఏర్పాటు చేసింది. ఈ కార్యక్రమము ఏప్రిల్ 29 వ తేదీ సోమవారం రాత్రి 9-30 గంటలకు విజయవాడ, హైదరాబాద్, మద్రాస్ బి కేంద్రములనుండి వినగలరు.

## మద్రాస్ షార్ట్‌వేవ్ ప్రసారాలు

ఉదయం 61.98 మీ (4920 కిలోసై)

మధ్యాహ్నం 41.90 మీ (716 కిలోసై)

సాయంత్రం 60.98 మీ (492 కిలోసై)

పైన ప్రచురించిన షార్ట్‌వేవ్ మీటర్లలో ఉదయం 7-00 నుండి 7-15 వరకు, మ॥ 1-50 నుండి 2-00 వరకు సాయంత్రం 7-00 నుండి 7-15 వరకు, రాత్రి 9-30 నుండి 10-30 వరకు మద్రాస్ (ఎ) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

సోమవారము రాత్రి 9-15 గంటలనుండి, బుధవారము రాత్రి 7-45 నుండి 9-30 వరకూ పై మీటర్లలో మద్రాస్ (ఎ) కార్యక్రమాలను వినవచ్చును. తక్కిన సమయాలలో పై షార్ట్‌వేవ్ మీటర్లలో మద్రాస్ (బి) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

## విజయవాడ-బి

200 మీ (1500 కిలోసై)

(వివిధభారతి రిలే)

ఆదివారములు మినహా మిగతా రోజులలో

ప్రసారము I ఉ॥ 7-00 నుండి 9-30

" II " 11-00 నుండి 12-00

" III " 2-00 నుండి 3-00 వరకు

ఆదివారములు ముఖ్యమైన పండుగ దినాలు

ప్రసారము I ఉ॥ 7-00 నుండి 9-30

" II " 10-15 నుండి 12-00

" III మ॥ 2-00 నుండి 3-30 వరకు

[వివరాలు 52-వ పేజీలో]

## బెంగుళూరు-బి

365.9 మీ (820 కిలోసై)

వివిధభారతి (రిలే)

| ఆదివారములలో | ఇతర రోజులలో |
|---|---|
| ఉ॥ 7-00 నుండి 9-30 | ఉ॥ 7-00 నుండి 9-30 |
| 10-15 నుండి 12-00 | 11-00 నుండి 12-00 |
| మ॥ 2-00 నుండి 3-30 | మ॥ 2-00 నుండి 3-00 |
| 4-00 నుండి 6-5 | 4-00 నుండి 6-15 |
| సా॥ 6-30 నుండి 9-45 వరకు | సా॥ 6-45 నుండి 9-45 వరకు |

[వివరాలు 52-వ పేజీలో]

## బృంద, ముక్త సంగీత కచేరీ

శ్రీమతి టి. బృంద, శ్రీమతి ముక్త గాయకులు, సంగీత ప్రపంచంలో విశిష్టులు, సుప్రసిద్ధులు అయిన వీణ ధనమ్మాళ్ మనుమరాండ్రు. వీరు కర్ణాటక సంగీతంలో తంజావూరు సంప్రదాయానికి చెందిన సంపదకు ప్రాతినిధ్యం వహిస్తారు. వీరి గేయభాండాగారం చాలా విస్తృతమైనది. సంగీత త్రిమూర్తులు త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామాశాస్త్రి గారల కృతులను, క్షేత్రయ్య మువ్వగోపాల పదములను వీరు మధురంగా గానం చేస్తారు. సంప్రదాయ శుద్ధమైన రీతికి చెందిన కొద్దిమంది విద్వాంసులలో వీరు. కృతి అభివ్యక్తిలోనూ లావణ్య యుక్తంగా భావవ్యాఖ్యానంలోనూ వీరివి చెప్పుకోదగ్గ పేర్లు.

అఖిలభారత సంగీత కార్యక్రమములో ఏప్రిల్ 27 వ తేదీ రాత్రి 9-30 కు వీరి గానాన్ని వినవచ్చును.

## సుబ్బమ్మ అగ్రాసనాధిపత్యం

సుబ్బమ్మచేసే సాహసాలు, సుబ్బమ్మ వ్యక్తిత్వంలాగానే నానా వ్యక్తుల ఆలోచనలకు అంతుపట్టవు. సుబ్బమ్మ పై ఆకేంద్రానికి ఏర్పాటు చేసింది. సుబ్బమ్మ కాంతివిహీనమైన కదిల్చే జట్టిగా ప్రయత్నించింది. ఓ సారి సుబ్బమ్మ దివాన్‌గా పనిచేసింది. సుబ్బమ్మ ఏం పనిచేసినా ఆమెచుట్టూ ఓ గందరగోళానికి కావలసినంత అంతో ఇంతో హాస్యమూనూ. సుబ్బమ్మ సాహసాలు అనే వరుసలో సుబ్బమ్మ అగ్రాసనాధిపత్యం కూడా, ఆకాశవాణి బెంగుళూరు కేంద్రం, వనితా ప్రసార కార్యక్రమంలో ఏప్రిల్ 30 మధ్యాహ్నం 12-30 కు శ్రీమతి ఇందిరా అప్పనగారిచే చెప్పబడుతుంది.

## మంగళవారం ఏప్రిల్ 16

శక 1885 చైత్ర 26

## మద్రాస్-ఏ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానం
6-50 తుదిప్పాడల్‌గళ్
7-00 అరుళ్ వాక్కు: మతగ్రంథ పఠనం
7-05 వాద్యసంగీతము
7-10 నేటికార్యక్రమ వివరణ, వాతావరణసూచన (తమిళం)
7-15 తమిళమున వార్తలు
7-30* తెయిది కురిప్పుగళ్
7-35 స్వాతితిరునాళ్ కృతులు
8-00 భావయామి - రఘురామం - స్వాతితిరునాళ్ రామాయణ రాగమాలిక ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

416.7 మీ (720 కిలోసై)

1-00* మాదర్ విగప్పి స్త్రీలకు (తమిళం)
1-30 గానమంజరి†
1-40 హిందీలో వార్తలు
1-50 వాతావరణ సూచన గీతమంజరి†
2-00 తమిళమున వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

416.7 మీ (720 కిలోసై)

5-30* ఎ. డి. ఇందిర
6-05 ప్రాంతీయ తెయిదిగళ్
6-20 గ్రామస్థులకు (తమిళం)
(7-00 నుండి 7-15 వరకు పాత వేవ్‌పై కూడా)
7-15 తమిళమున వార్తలు
7-30* నిత్యగానం†
7-40 మద్రాస్ బి వలె
8-30 Inaugural talk by Dr. B Gopala Reddy on Swati Tirunal (relay from Delhi)
8-45 తిరుచ్చి వలె
9-00 సంగీతమాల†
9-15 దేశభక్తిపాటలు (హిందీ)
9-30 ఐ దావదు నాయ్ శ్రీ వాత్సన్ హ ది నాటిక తమిళం అనువాదం: సరస్వతి రామనాథన్
9-45 ... జోక్ ...: ప్రియకవిత ఎస్ మానిలావతి
10-00 సంగీతామృతం‡ టి.ఆర్. మహాలింగం: వేణువు
10-30 జనగణమన. వాతావరణ సూచన. ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 సంగీత మంజరి†
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ 1420 కిలోసై
41.90 మీ (7160 కిలోసై)

12-00* కార్మికుల కార్యక్రమం
12-30 ప్రసార సమాప్తి

ప్రసారము II (తరువాయి)

1-00 కదంబం†
1-15 వాద్య గోష్ఠి
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 గీతమంజరి†
1-50 తెలుగులో వార్తలు**
2-00 మధురగీతం†
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్యసంగీతం
6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-20 వాతావరణ సూచన, స్థానిక ప్రకటనలు, వాణిజ్యవార్తలు (ఆంగ్లం)
6-30 కార్యక్రమ వివరణ (తమిళం)
6-35 ఎ. డి. ఇందిర
7-00 తెలుగులో వార్తలు**
7-15 గోటువాద్యం: నిలయ విద్వాంసుడు
7-30 వానవెలి ప్రయాణం నాటిక (తమిళం) డా॥ ఎమ్. ఎ. తంగరాజ్
7-45 తిరుచ్చి వలె
8-55 Topic for today
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 India and the Dragon
9-30 Guilty Party II (B.B.C.T.S. Recording)
10-00 మద్రాస్ ఎ వలె
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన. ప్రసార సమాప్తి

## బెంగుళూరు

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత నిత్యదీప్తి కార్యక్రమ వివరణ
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 వార్తా వివరణ
6-50 గీతారాధన
7-05 మార్కెట్ ట్యూన్స్
7-15 వెంకటప్పాచార్ హర్డి
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 శ్రోతృవాణి
8-30 బజారు ధరలు
8-35 సి. కె. తార
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* వెంకటప్పాచార్ హర్డి
12-30 వనితావిహార
1-10 కన్నడమున వార్తలు
1-20 ఎస్. శారద: దేవరనామ
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 ఎస్. శారద దేవరనామ
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు వాతావరణసూచన (ఆంగ్లం)
6-10 ఎస్. శారద దేవరనామ
6-20 భజనావళి
6-35 ప్రదేశసమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 తరంగరంగ కదంబ కార్యక్రమము
8-30 ఢిల్లీను డి రిలే
9-45 గానవైవిధ్య† ఎమ్. బాలమురళీకృష్ణ ఎమ్. ఎల్. వసంతకుమారి టి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం
8-55 Topic for today
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 విజ్ఞానదమున్నడె
9-25 వేణువు†

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 52వ పేజీలో]

*షార్ట్ వేవ్‌పైకూడ వినవచ్చును
**211.3 మీటర్లపై మాత్రం

9-30 వి. వి. ఉత్తూర్‌కర్: హిందూస్థానీ శాస్త్రీయసంగీతం డి. ఆర్. పార్వతీకర్: దత్తాత్రేయ వీణ
10-35 వాతావరణ సూచన, జనగణమన ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319.1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45 మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 మద్రాస్ వలె
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 మద్రాస్ వలె
7-35 రామనాథపురం ఎస్. పిచ్చుమ్మాళ్
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30* ప్రసార సమాప్తి

ప్రసారము III

1-00* కదంబం†
1-40 హిందీలో వార్తలు
1-50 వాద్యసంగీతం†
2-00 తమిళమున వార్తలు
2-10 రామనాథపురం ఎస్. పిచ్చుమ్మాళ్
2-40 పొన్నొలిర్ భారతం
2-45* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

1-45* వివిధభారతి
5-45 సంగీతపాఠం
6-00 స్థానికప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-20 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 మద్రాస్ బి వలె
7-45 తిరుప్పాంబురం ఎస్. శివసుబ్రహ్మణ్య పిళ్లై
8-30 Inaugural talk on Swati Tirunal talk by Dr. B. Gopala Reddy (relay from Delhi)
8-45 తిరుప్పాంబురం ఎస్. శివసుబ్రహ్మణ్య పిళ్లై
8-55 Topic for to day
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మెల్లిశై
9-30 మద్రాస్ బి వలె
9-45 మద్రాస్ ఎ వలె
10-00* ప్రసార సమాప్తి



‡ [illegible] † గ్రామఫోను రికార్డు ‡ టేపు రికార్డింగ్

మంగళవారం ఏప్రిల్ 16

## హైదరాబాద్-ఎ

405.4 మీ (740 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత్
కార్యక్రమ వివరణ

6-40 ఆంగ్లమున వార్తలు

6-45 భక్తిరంజని
(విజయవాడనుండి రిలే)

6 55 సూక్తి ముక్తావళి

7 00 తెలుగులో వార్తలు

7-15 ప్రమ్మితాంశం

7-20 హిందూస్థానీ సంగీత శిక్షణ

7-30 సుగం సంగీత్

7-45 శాస్త్రీయ సంగీత్†
మీరా బెనర్జీ
బడేగులాం అలీఖాన్

8.00 ఆంగ్లమున వార్తలు

8 15 విజయవాడవలె

9-00*ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30 కార్మికుల కార్యక్రమము
పరిశ్రమల్లో శిక్షణ వృత్తి
ప్రసంగం
వింతలు విశేషాలు
దేశభక్తి గేయం

1-00 వనితావాణి
(విజయవాడనుండి రిలే)

1-30 వాద్య గోష్ఠి:
విజయవిద్యాంసులు

1-40 హిందీలో వార్తలు

1-50 తెలుగులో వార్తలు

2-00 హైదరాబాద్ బి వలె

2-10 ఉర్దూలో వార్తలు

2-20 హైదరాబాద్ బి వలె

2.30*ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
కార్యక్రమ వివరణ

6-05 ప్రాంతీయ వార్తలు

6-20 సుగం సంగీత్
అనితా తల్వార్
బి. ఎస్. సింగ్
పి. చటర్జీ
పి. లీల

6-30 పిగింవాణి
మిరాలాం మండి
హైదరాబాద్ కూరగాయల
మార్కెట్‌పై డాక్యుమెంటరీ
రూపకం
జానపద సంగీతం

7-00 తెలుగులో వార్తలు

7-15 కన్నడ శ్రోతలకు

7-30 హైదరాబాద్ బి వలె

7-45 రేడియో వార్తావాహిని

8 00 శ్రోతలకోరిన పాటలు†

8 30 Inaugural talk on
Swathi Tirunal
by Dr. B. Gopal Reddy
(relay from Delhi)

8-45 ఎమ్. ఎస్. మహాదేవన్

9-55 Topic for today

9-00 ఆంగ్లమున వార్తలు

9-15 ఉర్దూలో వార్తలు

9-30 దేశ ఆర్థికపరిస్థితిపై
మాసిక కార్యక్రమము

10-30 ఆంగ్లమున వార్తలు

10-35 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I

49·02 మీ (6120 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె

7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

60 12 మీ (4990 కిలోసై)

9-00 హైదరాబాద్ ఎ వలె

2-00* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

49.02 మీ (7140 కిలోసై)

2-30* హైదరాబాద్ ఎ వలె

3-00 వాతావరణ సూచన
ఎమ్. ఎస్. మహాదేవన్

3-30* ప్రసార సమాప్తి

## విజయవాడ

361·1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* శుభోదయం

6-35 ప్రసార విశేషాలు

6-40 ఆంగ్లలో వార్తలు

6-45 భక్తిరంజని:
స్వాతి తిరునాళ్ కృతులు

6-55 సూక్తి ముక్తావళి

7-00 తెలుగులో వార్తలు

7-15 నేటి విశేషం

7 20 పుష్పాంజలి

7-30 అమీర్‌ఖాన్

8-00 ఆంగ్లంలో వార్తలు

8-15 దేశభక్తిగేయాలు

8-30 ఎస్. పి. హెచ్.
కృష్ణమాచార్యులు:వయోలిన్

9-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమం
(హైదరాబాద్‌నుండి రిలే)

సా॥ ప్రసారము III

60·12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె

6-20 గ్రామస్థుల రేడియో గోష్ఠి
ప్రకటనలు. ధరలు, వాతావరణం

7-00 తెలుగులో వార్తలు

7-15 గ్రామస్థుల కార్యక్రమము

7-30 సాహిత్యసంచిక
సాహిత్య కార్యక్రమము
సాంబయ్య కుటుంబములో
నపుర ప్రయత్నం
సీరియల్ కథ (2వ భాగం)
రచన: మరమహాళి
స్వీయకవిత : అరిపిరాల

7-45 హైదరాబాద్ ఎ వలె

9-15 India and the Dragon
(relay from Delhi)

9-30 హైదరాబాద్ ఎ వలె

10 35 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

1-00 పేరంటం
స్త్రీల కార్యక్రమము
ప్రబోధ గేయము
ఆవిష్కరణ
శిశు పోషణలు
ప్రసంగము
మట్టా లక్ష్మీవెంకటేశ్వరరావు
సుభాషితాలు
మంగళం

1-30 భారతదేశంపై చైనాదురాక్రమణ
రూపకం

1-40 హిందీలో వార్తలు

1-50 తెలుగులో వార్తలు

2-00 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు

6-05 ప్రాంతీయ వార్తలు

6 20 గ్రామస్థుల రేడియోగోష్ఠి
ప్రత్యక్ష సేవ
నిరక్షరాస్యత
మహిళా వరికళలు
చేయవల్సినపనులు
సంభాషణ

ప్రభుత్వ సహాయము
సంభాషణ
ప్రకటనలు, ధరలు, వాతావరణం

7-00 తెలుగులో వార్తలు

7-15 గ్రామస్థుల కార్యక్రమము
దేశభక్తి గీతం
విశేషాలు
చేయంగల పెద్ద పాటలు

7-30 సాహిత్యసంచిక
(హైదరాబాద్‌నుండి రిలే)

7-45 రేడియో వార్తావాహిని
(హైదరాబాద్‌నుండి రిలే)

8-00 పాంచజన్యం
రూపకము

8-30 The 150th Birth
Anniversary
Celebrations of
Swathi Tirunal
Inaugural talk by
Dr. B. Gopala Reddi
(relay from Delhi)

8-45 [illegible]
శ్రోతలకోరిన పాటలు

8-55 Topic for today

9-00 ఆంగ్లమున వార్తలు

9-15 India and the Dragon

9-30 మాసిక కార్యక్రమము
(హైదరాబాద్ నుండి రిలే)

10-30 ఆంగ్లలో వార్తలు

10-35 వాతావరణ సూచన
ప్రసార సమాప్తి

## బుధవారం ఏప్రిల్ 17

శక 1885 చైత్ర 27

### మద్రాస్-ఏ

ఉ॥ ప్రసారము I

416·7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానం
6-50 తుదిప్పావడల్ గళ్
7-00 అరుళ్ వాక్కు: మత గ్రంథ పఠనము
7-05 వాద్య సంగీతం
7-10 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన (తమిళం)
7-15 తమిళములో వార్తలు
7-30* శెయిది తిరిప్పుగళ్
7-35 స్వాతి తిరునాళ్ కృతులు: ఎన్. సి. సీతారామన్
8-00 మధుర గీతం †
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

416·7 మీ (720 కిలోసై)

1-00* పెణ్ణులగం స్త్రీలకు (తిరుచ్చినుండి రిలే)
1-30 గానమంజరి†
1-40 హిందీలో వార్తలు
1-50 వాతావరణ సూచన, గీతమంజరి†
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

416.7 మీ (720 కిలోసై)

5-30* అండాళ్ నరసింహన్
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-20 గ్రామస్థులకు (తమిళం) (తిరుచ్చినుండి రిలే)
(7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పై కూడా)
7-15 తమిళములో వార్తలు
7-30* వార్తాసమీక్ష (తమిళం)
7-45 నాటిక (తిరుచ్చినుండి రిలే)
8-00 జానకీనాథన్: వీణ
8-30 A Nation prepares
8-45 Political commentary by Prem Bhatia (relay from Delhi)
9-00 జానకీనాథన్: వీణ
9-30 పదం, జావళి: టి. బృంద, టి. ముక్త
9-45 వి. మాణిక్యం: నాదస్వరం
10-30 జనగణమన, వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211·3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 వాద్యగోష్ఠి
7-30 మద్రాస్ ఎ వలె
7-35 [illegible]
7-5[illegible] దేశభక్తి పాటలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211·3 మీ (1420 కిలోసై)
41·60 మీ (7160 కిలోసై)

12-00* కార్మికుల కార్యక్రమము
12-30 ప్రసార సమాప్తి

ప్రసారము II (తరువాయి)

1-00 కదంబం†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 గీతమంజరి †
1-50 తెలుగులో వార్తలు **
2-00 మధురగీతం †
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211·3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతం†
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-20 వాతావరణ సూచన, స్థానిక ప్రకటనలు, వాణిజ్య వార్తలు (ఆంగ్లం)
6-30 కార్యక్రమ వివరణ (తమిళం)
6-35 [illegible] (హిందీ నాటికకు తమిళం) అనువాదం: సరస్వతీ రామనాథ్
6-50 కదంబం†
7-00 తెలుగులో వార్తలు**
7-15 బృందగానం†
7-30 సంగీతమాల†
7-45 నేటి అత్యవసర పరిస్థితి: ఒక ఆర్థిక విధానము, [illegible] ప్రసంగము
8-00 ప్రతిజ్ఞ నాటిక రచన అనిసెట్టి సుబ్బారావు
8-30 అండాళ్ నరసింహన్
8-55 Topic for today
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 India and the Diago
9-30 'Swathi Tirunal' talk by His Highness Marthanda Varma Elaya Raja of Travancore (relay from Delhi)

### బెంగుళూరు

491·8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత [illegible]
కార్యక్రమ వివరణ
6-45 వార్తా వివరణ
6-50 గీతారాధన
7-05 రాష్ట్రవందన
7-15 ఎస్. శారదాంబ: వీణ
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 జయఘోష్
8-30 బజారు ధరలు
8-35 మనోరమా [illegible]: దేవదాసు
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికుల కార్యక్రమము
12-30 సి. వి. నాగరాజ్
1-10 కన్నడములో వార్తలు
1-20 బి ఎస్ రామయ్యంగార్†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 వాద్య మంజూష†
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు, వాతావరణ సూచన (ఆంగ్లం)
6-10 వసంతా వేణుగోపాల్: వీణ
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8.00 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (ఉర్దూ)
8-15 విశ్వవిద్యాలయాలకు
8-30 A Nation Prepares (relay from Delhi)
8-45 Political Commentary by Prem Bhatia
8-55 Topic for today
9 00 ఆంగ్లములో వార్తలు
9-15 సమాచారదర్పణ
9-30 ఢిల్లీనుండి రిలే

9-45 పాశ్చాత్య సంగీతం †
10-35 ప్రసారసమాప్తి

### మద్రాస్-సి

193.5 మీ (155[illegible] కిలోసై)

వివిధభారతి (రిలే, [విశాఖ 52వ పేజీలో] [illegible] **211.3 మీటర్లపై మద్రాసు [illegible]

9-45 కొనల్లా కృష్ణస్వామి
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

### తిరుచ్చి

319·1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45 మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 మద్రాస్ ఎ వలె
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళములో వార్తలు
7-30 మద్రాస్ ఎ వలె
7-35 మద్రాస్ బి వలె
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లములో వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30* ప్రసార సమాప్తి

మధ్యాహ్నము III

1.00* పెణ్ణులగం స్త్రీలకు
1-30 వాద్య సంగీతము†
1-40 హిందీలో వార్తలు
1-50 [illegible]
2-00 తమిళములో వార్తలు
2-10 సీతారామకృష్ణన్: వీణ
2-40 [illegible] వాద్య సంగీతం
2-45* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-45* వివిధభారతి
5-45 వాద్యసంగీతం
6 00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-20 గ్రామస్థులకు
7-15 తమిళములో వార్తలు
7-30 మద్రాస్ ఎ వలె
7-45 [illegible] నాటిక
8 00 స్వాతిమణ్ణన్ (స్వాతి తిరునాళ్ జీవితము చిత్రించు రూపకము)
8-30 A Nation Prepares (relay from Delhi)
8-45 Weekly talk by Prem Bhatia
8-55 Topic for today
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 నల్లురై
9-20 [illegible]
9.30 ఢిల్లీనుండి రిలే
9-45 సంగీతమాల†
10-00* ప్రసార సమాప్తి



* [illegible] ప్రకటన † గ్రామఫోన్ రికార్డ్ ‡ [illegible] రికార్డింగ్

